< ౨ చరు



# క్రీస్తువిజయధ్వజము.

తే॥ గీ॥ క్రీస్తు విజయధ్వజంబహా • క్షితిలయందు
భక్తిఁ జదివిన వారికిఁ • బ్రభువుయేసు
రక్షకుండయి సుఖముల • నక్షయముగ
నిచ్చి కాపాడుఁ జదువుఁడీ • యింపుమీర




గ్రంథకర్త:

సై. జాన్. యెలీషా
సంగీత చిత్రలేఖనోపాధ్యాయుఁడు.





బా. మిషన్. బాలికాబోధనాభ్యసన పాఠశాల,
ఒంగోలు.

1926



[వెల రు. 0—8—0

# విజ్ఞప్తి.

పాఠకమహాశయులారా!

మన భారతీయులు హరికథలు వినుటయం దాసక్తిపరు లనిదలచి శ్రీయేసునాథస్వామివారి చరితమును హరికథాను సారముగా నవీనఫక్కి ననుసరించి ఫార్సీమెట్లతోను, శుద్ధమైన తెలుగు సంగీత కీర్తనలతోను నాకా మహనీయునిపైఁ గల భక్తిని తెలుపుకొనుటకీ చిన్ని పొత్తమును రచించితి. రసజ్ఞులీ గ్రంథంబునంగల లోపంబుల మన్నించి నాయుద్యమమునకుఁ బ్రోత్సాహ మొసంగఁ బ్రార్థించు

2-4-1925,
ఒంగోలు.

భవత్కృపాభిలాషి,
వై. జాన్. యెలీషా,
గ్రంథకర్త.

# పండితాభిప్రాయములు

ఇయ్యది సంగీతోపాధ్యాయులగు వై. జాన్ ఎలిషా గారిచే విరచితంబయి, మృదుమధుర గద్యపద్యాదులచే నొప్పారు మన రక్షకుని దివ్యకథామృతము. దీని నామూలాగ్రముగాఁ జదువుటయేగాక గ్రంథకర్తచే సత్కథాకాలక్షేప మొనరింపఁబడునపుడును గర్ణపర్వముఁ గావించుకొంటి. ఇది సువార్తా వ్యాపనార్థమెంతయు నుపకరించునని నాదృఢ విశ్వాసము. క్రైస్తవ మతాభిమానులు గ్రంథకర్తకు నత్యంతప్రోత్సాహముఁగలిగింపఁ బ్రార్థించుచున్నాఁడ.

27th March 1925,
రామాయపట్టణము.

మల్లెల దావీదుగారు,
అ. బా. మిషన్ వేదాంత పాఠశాలోపాధ్యాయులు.

శ్రీయుత వై. జాన్. యెలీషాగారిచే రచింపఁబడిన క్రీస్తు విజయధ్వజంబను పొత్తంబును స్థాలీపులాకన్యాయంబున నచ్చటచ్చటఁ గొన్ని పద్యంబులఁ గొన్ని కీర్తనలఁ జూచితి. అందలి భావంబును, ధారాశుద్ధియు నోజ ప్రసాదాది కవితా గుణంబులును మొదలగునవి సరస హృదయంగమంబులుగ నున్నవి. ఇయ్యది పండిత పామరులకు పఠనీయమై యానందంబుఁ గలిగించునదియై యున్నది.

21-4-1925.

ఇట్లు,
గొల్లపూడి శ్రీరామచంద్రశాస్త్రి,
అ. బా. మిషన్ ఉన్నత పాఠశాల
తెలుఁగు పండితులు,
ఒంగోలు.

Mr. Y. John, Elisha has written his "క్రీస్తు విజయధ్వజము" in simple easy Style. It meets a need among the Indian Christians. The tunes though sastraic are adapted for everyday use in villages.

It makes a good companion for village preacher, and helps the ordinary Christian to know the story of our Blessed Lord, in the tunes that he likes to sing most.

21-4-1925.

Mr. G. VANDANAM,
B. A. & L. T.
Headmaster.
A. B. M. High School,
Ongole.



# క్రీస్తు విజయధ్వజము

దైవప్రార్థన:—

రాగము: కాఫి :కీర్తన: తాళము: రూపకము.

దేవ!స్తోత్రజాలములను—దీసికొనుము ప్రేమతో
భావమందు నిన్నుదలఁచి — పాడుచుంటి నీకథ
కావుమంచు వేడినాఁడ—గార్యసిద్ధిఁజేయుమా
జీవకోటు లెల్లరునీ — చింతన మొనరించునటుల
సావధానులుగ నొనర్చు — పాయమిడు మహేశా! దేవ॥

రాగము బిళహరి స్వరజాతి:— తాళము: ఆది.

కారుణ్యుండా! నిర్వి — కారుం — డా! రసవిజయ పర
మసుతుడా!॥ ఘోరపాపినా దయాంభో! — చేరఁదీసి
ముక్తినిమ్ము ॥కారు॥ వందనీయుడా! నే — నెందుఁబో
జాల - నీ - యందునుండు సదమలమదినా - హృదయ
మునవిడి - సుతునిగఁదలఁచుము ॥కారు॥
ఇలనేఁబలుపా - పములను జేసియు నిను - కలతను బెట్టి
తిని - ఖలుఁడనని - దలచుచునీ - విలువగు ప్రేమను నిడ
గదియర ॥కారు॥

రా మరియసుతా! - సుజననుతా!! - దివిభువి సచ్చరితా!!
నీమహిమను - నీగుణమును నే - చవిగొనినుప్పొంగి - సార
కుసద్భక్తిఁ చారుపాదాబ్జంబున్ - జేరి సుఖింపంగన్ -
కరములచే - నడుపుచునను మనుపుము ప్రభో! ॥కారు॥

చ॥ పరమ మహేశుఁడాద్యుఁడును • పావనమూర్తియుమోక్ష
దాతయు
న్నురుతరసద్గుణాకరుఁడు • నుజ్జ్వలకీర్తివిశాలుఁడౌచు నీ
నరుల దురంతదుర్గతుల • నాశమొనర్చెదు, యేసుక్రీస్తు న
చ్చరితముఁ జెప్పబూనితిని • సారమతిఁ గృపనాలకింపుఁడీ

—* విన్నపము *—

రా: శంకరాభరణము కీర్తన: తా, రూపకము.
సజ్జనులారా! ప్రభు —చంద్రుని చరితంబుఁబాడు—సఖుని
విన్నపములఁగొనుడీ—
యిజ్జగమునవిద్దెనో— కింతయునెరుగని వను - బుజ్జగించి
లోపంబులఁ— బొల్పునమన్నింపుడిటను ॥సజ్జ॥
వ॥ నాయొనర్పం బూనిన శ్రీక్రీస్తు విజయధ్వజంబను గ్రంథంబు
నకుగథా క్రమంబెట్టిదనిన :—

—: రక్షకునగత్యత :—

సీ॥ ఆదిలోసృష్టిని । రాకారమై శూన్య
మైయొప్పుచుండన । త్యద్భుతముగ
సృజియించె దేవుండు । శృంగారముగను జం
ద్రార్కతారలభువి । నాకసమును

నదిమంచిదని తన । యాత్మలో భావించి
వృక్షజాతంబులఁ । బక్షివితతి
సమకూర్చి క్రమ్మర । జంతుసంతానంబు
సృష్టిగావించెను ॰ తత్సృష్టగతిని
వీనిఁ బాలింపఁగ । జానుగా దేవుండు
మనుజుని జేసె; నా । తనికితోడు
పతివ నొక్కతె తేఁజె ॰ ల్యారంగఁగావించి
దారఁగా నొసఁగె నా । దామునకును;
యే దేనువనములో ॰ నిరువురినునిచి య
వ్వనమధ్యమునఁ బెంపు ॰ దనరునొక్క
వృక్షఫలంబుల ॰ భక్షింపకుండని
యాజ్ఞనిడియెను న ॰ ర్వజ్ఞుఁడప్పుఁడు

తే॥ గీ॥ హవ్వయాదాములట్టిదై ॰ వాజ్ఞమీఱి
పతితులై దైవకృపకు న ॰ పాత్రులైరి,
వారిసంతతి పాపులై ॰ వసుధయెల్ల
నలమికొనఁ గ్రీస్తు డుదయించె ॰ నట్టితఱిని.

వ॥ పరమేశ్వరుండు ప్రవర్తలమూలంబున దనయవతారంబు లోకంబున కెరుంగబనిచియొక్కదూతను నజరేతునగరనివాసిని యగుమరియమ్మయను సుకన్యకామణిసమీపంబునకుబంపనాతండు.

—: ర క్ష కు ని జ న న ము :—

(దూత మరియమ్మకు ప్రత్యక్షమౌట)

రాగము॥ బేహాగ్ —: కీర్తన :— తాళము॥ ఏకత్రిశ్ర.

రాయబారంబుఁ దెచ్చెను - రయముగ దూత - రాయబారం

బుఁదెచ్చెను—న్యాయ సుశీలవీ - వాశీర్వాదంబు నొందు.
మోయమ్మయంచుఁబల్కుచు - మరియమ్మకడకు ॥రాయ॥
1. వాసిగ శిశువు పుట్టును - యేసనుపేర - భాసిల్లుచుండు
సతతము - నీ సర్వసృష్టినేలు - నిమ్మాను యేలుడెల్ల -
దోసంబులుడుపు నంచును - గాబ్రియేలుదూత ॥ రాయ ॥
వ॥ ఇవ్విధంబున కన్యమరియాంబతో గాబ్రియేలుదూత వక్కా-
ణించిన పిదప మరియమ్మ తన మనమున గలవర మొంది
తోహార:— శ్రీశువార్తలటు వీనులసోకగ - శ్రేయుడు
దూతయటుండెఁ = ఈశుభవచనం బేమిటి
యని తన - హృదయంబున దర్కించెఁ.
వ॥ పిదప గాబ్రియేలుదూత మరియమ్మతో
క. పరిశుద్ధాత్మబలంబే
వరపుత్రు నొసంగునమ్మ • భయపడకమ్మా!
పరిశుద్ధ శిశువుసుమ్మా
పరమేశ్వరుసుతుఁడటంచు • బరగుగదమ్మా.
వ॥ ఇబ్భంగి వక్కాణింప నతనికి మరియమ్మ యిట్లనియె.
తోహార:— కన్యక కేవిధిఁ గల్గును కొమరుఁడు ॥ కడు
చిత్రంబిదిచూడఁ=అన్యం బేమియు నెఱుగని
దానను ॥ మాన్యతబోవదె? యేడఁ.
వ॥ అంత దూత.

రాగము॥ ముఖారి. : కీర్తన : తాళము॥ ఆది.

పరమజనకుని సంకల్పమున - వ్వరు గ్రహింప గలరో!
మరియా! =ధరనుండు స్త్రీలందరిలోఁ -గరుణింపబడితివ

మ్మా=నరులఁబోవఁగ నుదయించును శ్రీకరుఁడు నీగర్భ
మున ననిజనెఁ.

—• మరియమ్మ గర్భవతియగుట •—

వ॥ పిమ్మట కొన్నినాళ్ళకు.

సీ॥ పూతబల్కినరీతి • నాతియౌ మరియమ్మ
గర్భంబు ధరియించెఁ • గాలగతిని
నదిజూచి యోసేపుఁ • డనుమానమును జెంది
విడనాడనెంచె న • వ్విమలచరిత
సర్వేశ్వరునిదూత • స్వప్నమందతనికిఁ
బ్రత్యక్షుఁడై యిట్లుఁ • బల్కెనపుడు
విమలాత్మచే మేరి • కొమరుని ధరియించె
వినుమయ్య యోసేపు • విభునినుడిని
తే॥ గీ॥ ప్రజల పాపముల్ బోకార్చు • ప్రభుడతండు
పరగ శుద్ధాత్మశక్తిచేఁ • బ్రబలువాడు
యేసుడను శుభాభిఖ్యచేఁ • నెసగువాడు
మరియ గుణవతిపు మ్మను • మాన మేల.

వ॥ తదనంతరంబు యోసేపుండు మనమున నెలకొనియున్న సంశయంబులు వదలి యమ్మరియా సతీలలామంబును, పరమానంద కందళిత హృదయారవిందుండై పరిగ్రహించి కాలమతిక్రమించుచుండు సమయంబున తద్దేశాధీశ్వరుండైన కైసరాగూస్తుండు సర్వలోక ప్రజాసంఖ్యాగణము నభిలషించి.

రాగము॥ యమన్.　　　• కీర్తన •　　　తాళము॥ ఆది.

కైసరౌగూస్తిడెను-ప్రజాసంఖ్య వ్రాయఁబడను=వాసికఁ
బురములఁవీడియుఁ దమ తమ - వాసస్థలముల కేగుట
కాజ్ఞ ॥ కైస ॥

1. గానప్రజలెల్లరునీ - ప్రభు - నానతికైకొనుచున్=బూని
కతోఁ దమ పురముల కేగఁగఁ - జైన మొనర్చిరి పరమ
ముదంబున ॥ కైస ॥

2. గలిలయ్యలోనజ రేతు - గ్రామంబు వీడియూ దయ్యూ
స్థలిని బెత్లెహేమను పురమునకు-నెలమిని జనిరి మరియు
యోసేపులు ॥ కైస ॥

వ॥ పోయి సత్రమునందు వారు వసియింప నుచితావాసంబు
లభియింపకుంటమి.

రాగము॥ బ్యాగ్　　　: కీర్తన :　　　తాళము॥ఏక

బాలయేసునుంపఁబసుల - శాలయయ్యెను
పాలకుండురికర్తఁడయి - పవ్వళింపను ॥బాల॥

వ॥ మరియు యోసేపులు పశుశాలలో క్షేమముగా నుండునంత
నవమాసములు నిండి యొక శుభదినంబున.

తే॥ గీ॥ ప్రసవవేదనజెంది యా • రాత్రివేళ
మేరిగనెఁ జన్నికొమరుని • మించుదీప్తి
గల్గువానిని లోకముల్ • గాచువాని
సరసగ్రీస్తుని పశువుల • శాలయందు.

వ॥ మరియు.

తే॥ గీ॥ పరమజనకుండు సంతోష • పరతఁ జెందఁ
ప్రవచనోక్తులు పృథ్విపై • ఫల్యమొందఁ
బతితులెల్లరు నిత్య స • ద్గతులనంద
యేసుఁడుద్భవించెను బెత్లె • హేమునందు.

రా॥ ధీరశంకరాభరణము—: కీర్తన :— తా॥ రూపకము.

ఏరువర్ణింపఁగలరు క్రీస్తుని - చారుసుగుణజాలములను -
పారమార్థికోజ్జ్వలకృపా - సారములనవనీస్థలిఁ =
ధీరశరీరగ - భీరహృదయకు - హారములిడెడు - ధీ
రోదారునకు జోహారులనిశము ॥ ఏరు॥

1. మోదమందుఁడీ! యెహోవ - పాదపద్మముల గొల్వుఁడీ!
వేదవాక్యములఁగొనుఁడీ! - సాదరముననిలమనుఁడీ=
యూద బెత్లెహేము-లోదయామయుండు-వేదవానిగను-
దర్భాతుఁడయ్యెదుర్ - వాదులకడ తేర్చను॥

2. వసులపాకయే ప్రభుని - పడకటిల్లుగాగ ఘనుని -
పొసగఁ బేద జనులతని - విసుకులేకఁ గనిరిభక్తిని-
యసమాన తేజమా - పసులకొట్టమునల్ల - గసలు
చేమూగెడు - ప్రజలెల్లరును గాంచఁ - బరుగులెత్తిరి
వింతగాఁ ॥

3. దురిత దుర్గతుల ప్రమాద-మరసి మోక్షసౌఖ్యమువిడిచి
నరులపోల్కి--ధరణికన్య-మరియగర్భమున జనించి
నరసంతతికి తోవ-మరయుంగనిడి దేవుఁ-గరుణను
వడయుచుఁ-బెరిగె సొంపొందుచు - వర యేసు
క్రీస్తుప్రభు॥

తోహర:—ఇట్టులబుట్టిన చిన్నిబాలకుని-యేసుని తొ
ట్టిలోనునిచి।పట్టరాని ముదమందుచుఁద
యు-పాడెను పాటలఁదలచి

రాగము: శ్రీ —: జోలపాట :— తాళము:అది

జో జో జో ముద్దులమరియాంబసు బాలా—!—జోల
బాడెదనుగృపాళూ !!=భూజనపాపముఁ-జోకార్చుటకై
నీజనకుండీజగమునకంపెఁ=బూజలనందగఁ - బెరుగుము
బాలా !- నీ జననముతోషంబిడె నరులకు॥ జోజో॥

1. విదితయశుండా !- సరయ హృదయుండా'! దినకర
సమాన తేజుండా !'!- మదమున పామరజన హృదయ
ములను- మదకరీంద్రముల నణప వర్ధిల్లుము॥జో జో॥

వ॥ అంత మరియమ్మ శ్రీ యేసును గుడ్డలతోఁజుట్టి లోక
భారావతరణార్థంబు శ్రీ భగవంతుఁడు తన గర్భంబున
జన్మించుటకు సంతసించుచు భగవన్మహిమాప్రభావంబు
నుతియించుచు భర్తచే నుపచర్య లందుచుండినపుడు బెత్లె
హేముపురి గొల్లలు తమ గొఱ్ఱెలను సమీపక్షేత్రంబుల
నర్ధనిశీథంబున గాయుచుండ నాకసంబున యపూర్వంబగు
గాంతియొప్పారుటఁగని విస్మయ చిత్తులయి యొండొరులతో

రాగము॥ బ్యాగ్ —: కీర్తన :— తాళము॥ ఆది.

అదిగో! ఆకాశమున - నత్యద్భుతంబుఁగల్గె = మది
కెంతో విస్మయం-బిది యెన్నఁడును గాంచ=మిదియేమి
చోద్యమొకో?-యీక్షింపరారే మీరు॥ అదిగో॥

వ॥ ఇట్లు గోపాలురు భీతిజెందుచుండ నొక దేవదూత వారితో నిట్లనియెను;

రాగము:మధ్యమావతి —: కీర్తన :—తాళము॥ ఆది.

భయపడకుఁడి-బోయలారా!- జయప్రదమగు వార్త మీకు-జానుగ వివరించెద వినుఁడీ = దయామయుడు భూతలమున- దైవమయి జననమాయె॥భ॥

1. ఇదిగో! రక్షకుఁ = డుదయమాయె - నిదిమహాప్రభుఁ బదిలమైన సమాచారము= సుదినమిదియె - హృదయమలర - నాధునిగాంచఁ - బదరెపదరె.

వ॥ ఇవ్విధంబునం బలికి యాదూత పరలోక సైన్య సమూహంబుతోఁగూడి దేవునిట్లు స్తుతించె.

రాగము: బ్యాగ్ —: కీర్తన :— తాళము: ఏక త్రిశ.

సర్వోన్నతంబైన- స్థలములలో దేవునికి సర్వదా మహిమఁ గల్గు= నుర్విపైఁదన - యుత్తమ ప్రజకు- సర్వదాసమాధానంబు—సంఘటిల్లుసంచుఁ బాడిరి ॥సర్వో॥

వ॥ ఇత్తెరంగున నాదూత వ్రాతంబు దేవుని స్తుతించి పరలోకమున కేగిన పిదప నాగొల్లలు,

క. సురుచిరమగు శుభవార్తను
పరమాత్ముఁడు దూతచేతఁ • బల్కించెను స
త్వరమునఁ జని కని పురి నె
ల్లరకును జాటుదము బోయ • లారా రండీ

వ॥ ఇట్లంగిని సంభాషించుచు నధికోత్సాహంబునఁ జని మరి యమ్మను యోసేపును గోష్ఠమున నునువఁబడి దేదీప్య మాన ప్రభా భాసురుండయి దురితాంధకార భాస్కరుం డయి దుష్కృత సంతాన తిరస్కరుండయి సదమల యశో స్కరుండై భాసిల్లు బాలునిగాంచి

తోహార:—కడు ముదమున నొడయుని పాదంబులఁబడి
నుతియించిరహో=బుడుతకుఁ గలిగిన తేజంబును
గని=బొగడినుతించి రహో

వ॥ అట్టుల నమస్కరించి పారితోషికంబుల నొసంగి పుర వీధులంబడి యేసునాధ ముఖారవింద సందర్శన జనిత సంతోషాంతరంగులయి నిజ నివాసంబులకుం జనిరి.

—: జ్ఞా ను ల స మ ర్ప ణ ము:—

తోహార:—ఈ విధమున బెత్తిలిహేమను పురి—నేనుఁడు
జననము నొందగ=భావికాల సంగతు లెరిగిన
ప్రాగ్భవ్యులు మదిముద మందగ

2. ఆకసమున బలుగాంతులు జిమ్ముచు - నలరెడు నొక
తారకను=జోకతొ గనుకొని విస్మయమందుచుఁజుక్క
గూర్చి దలచిరి మనమునను.

సీ॥ అదియేమితారయో । యాకసంబునఁబుట్టి
విలసిల్లుచున్నది । వింతగాను
నలుదెసలెగయుచు । నలరారుచున్నది
చూడఁజూడగఁ గడు । చోద్యముగను

వలుదెఱంగులఁ గాంతిఁ । బ్రసరింపఁ జేయుచు
భాసిల్లుచున్నద । పారముగను
రారాజుకీర్తివి । రాజితంబుగఁ జాట
ఆకిక్కయుద్భవమయ్యె । నిక్కవముగ
తే॥ గీ॥ గానవట్టిమహాత్ముని । కడకు నేగి
కానుకలసమర్పించుట । ఘనమటంచు
మమతబసిడి సాంబ్రాణిబో । ళములఁ గొంచు
జ్ఞానులేగిరి వడిగవి । జ్ఞానికడకు॥

వ॥ ఇట్లుజ్ఞానులు లొట్టిపిట్టలపైఁ బయనంబై హేరోదు పట్టణంబున చేరి విచారింప సమకట్టిరి.

రాగము॥ బిళహరి. : కీర్తన : తాళము॥ ఆది.

యూదులరాజట - యుద్భవమయ్యెనట - సాదరమున నెఱిగింపుడిట=

1. రారాజు తానట - రమ్యగుణుండట - భూరియశుండట- పుట్టెనట
కోరి భజింపగ నరిగితిమి-తారనుగాంచియుఁ దరలితిమి-
భారవిమోచకు-పాదాబ్జములకు - సాగిలపడుటకు-జేరితి
మిచటకు-గోరికఁ దీర్పుడు హితులారా- మీ - పేరిమిఁ
జూపుడు

వ॥ ఈ ప్రకారము విచారించుచుండ నీవార్త హేరోదురాజును యెరూషలేము పురవాసులందఱును విని కలవరమొందిరి. పిదప హేరోదుభూపాలుండు శాస్త్రిలను ప్రధాన యాజ

కులను గూర్చి క్రీస్తుఁడెక్కడఁబుట్టెనని వారిఁ బ్రశ్నింపగా వారిట్లు చెప్పిరి.

రాగము॥ బ్యాగ్.　　:కీర్తన:　　తాళము॥ ఆది

అదిగో! బెత్లెహేమా నీవె • యూదా ప్రధానులలో
నెంతమాత్రంబు హీనదశను బొందవు=
ముదముమీరఁ బ్రజలను వి-మోచింప నాథుఁడొక్కఁ-
డుదయమగునటంచుఁ బ్రవచ - నోక్తులెన్నో వ్రాయ
బడియె॥ ఇదిగో॥

వ॥ కావున నో రాజచంద్రా! క్రీస్తుండు యూదయబెత్లేహేము పట్టణరాజంబున నుద్భూతుడయ్యెనని వచియింప, మహీపాలుండాత్మనదరుపడి తూర్పుజ్ఞానులఁదన చెంతకు రావించి నక్షత్రోదయ విశేషంబులడిగి వ్యక్తంబుగా

క. పరగున మీరరిగియు శ్రీ
కరుఁడగు నా బాలనృపుని • గాంచివడిగనా
సరణిని దెల్పిన శిశుఁగన
నరుదెంచెద ముదముతోడ• నచటికి వేగన్.

వ. జ్ఞానులా త్రేని పలుకులువిని శీఘ్రంబున జనుచుండ తూర్పుదిక్కునఁ దాము గాంచిన రిక్క యా శిశువుండు స్థలంబునకువచ్చి నిలుచువరకు వారికి ముందుగ నడిచెనంత పట్టణంబుఁజేరి గోష్టగతుండగు నా చిన్నారిబాలుని భక్తితో జ్ఞానులిట్లు స్తుతించిరి.

రాగము॥ జంఝూటి. :కీర్తన: తాళము॥ ఆది.

రాజులరాజా!- రవిసమతేజా!!- రమ్యగుణసమాజా!!!
భూజనపాపముఁ - బోకార్చెడిప్రభో - పూజనొనర్తు
మిట॥ రా॥

1. బంగారమును సాం-బ్రాణియుబోళము-సంగగ నేగితిమి-
యింగితమనము లు-ప్పొంగగ వరములొ - సంగుము
జగదీశా॥ రాజు ॥

వ॥ ఇవ్విధంబున శ్రీయేసునాధుని బసిడి, సాంబ్రాణి, బోళము
మున్నగు కానుకలతో నారాధించి హేరోదు భూపాలు
నకుఁ దెలుప నుద్యుక్తులై యుండ దేవదూత స్వప్నంబున
దెల్పిన విధంబెట్టిదనిన:—

రాగము॥ బ్యాండువరుస : కీర్తన: తాళము॥ ఏకత్రిశ్ర

పోవలదు పోవలదు- భూవల్లభుండగు హేరోదు కడకు-
నీవార్తఁ దెలుప - వావదూకుండాతడు = జీవాధిపతి
యగు - దేవాత్మజునిజంప - భావించియున్నాడు॥

1. అరుగంగఁజనదు - హేరోదుకడకు- మరువంగఁదగదు-
దైవాజ్ఞనిపుడు- వెరువంగవలదు-ప్రభు కేమికీడురాదు=
సరగ వేరొక్క--సరణిపొండు- సర్వేశుడేలు మిమ్ము॥ పో॥

వ॥ సంతసమున బురవీధులంబడి యీాదిగువరీతిని యా ప్రభు
వునుజూచుచు వేరొకమార్గమున బోయిరని చెప్పుట కించుక
సందియము లేదు.

రాగము॥ హి. తోడి : కీర్తన : తాళము॥ రూపకము

ఘనులార ! సు - జనులారా!! - జనియించె దైవ-తన
యుఁడు నేడు మనసారఁ గొల్వరే - మనుజావతారుని -
హీనులన్-జ్ఞానులన్-తానురక్షించును

1. లోపంబింకేమి భక్త - లోలున్ భజింపరెండు సు- శ్లో
కుండు బెత్లెహేము-లో జనించె - జూడుడు- వేడుడు-
పాడుడు॥ ఘను

—♦ మరియమ్మను యోసేపును దూత మందలించుట ♦—

వ॥ అట నెరూష లేమున జ్ఞానులు క్రీస్తుని వృత్తాంతముఁదనకుఁ
దెలుపనికతంబున హేరోదు కోపంబునొంది యాబాలుం
డెప్పుడైనను దనరాజ్యం బాక్రమించుకొనునను దలంపున
నాశిశువుంజంప నెన్ని యో కుట్రలు పన్నుచుండె నత్తటి
దేవదూత యోసేపునకు స్వప్నంబున నిట్లనియె;—

రాగము హిం॥ తోడి —♦ కీర్తన ♦— తాళము ఆది.

అదయుండో హేరోదిపుడు - సదమలక్రీస్తుని- వధియింప
ను తా - మదినెంచెను వినుమా॥
పదిలంబున యోసేపూ!-బాలునిరక్షించుటకు-ముదమున
నైగుప్తునకు - గదలుమికాలుబిడ్డలగూడి॥ అ॥

1. పరమసుం - దరుడగుయేసుని - పరమాత్ముఁడుసం-
రక్షించునుసుమి - వెరువకుమోభక్తా॥
పర దేశంబిదియంచు - భావింపకనిక బొమ్ము
మురిమురిగా నేఁదెల్పువర - కరమర లేకనీవటనుండు॥ అ

వ॥ అందులకు యోసేపు శిరసావహించి, లేచి నిశీధసమయం బున శిశువును తల్లిని దోడ్కొని యైగుప్తుకు వెళ్ళి హేరోదుమరణపర్యంత మక్కడనుండెను.

హేరోదుకఠినశాసనము.

వ॥ అంత హేరోదు రాజెంతకాలము వేచినను జ్ఞానులజాడ గానడాయె. గాన నధికయాగ్రహావిష్టుండై బెత్లెహేము తత్సకల ప్రాంతములలోనుండు రెండేండ్ల ప్రాయంబు మొదలుకొని తక్కువ వయస్సుఁగల మగబిడ్డల నందరిని వధింపఁదలచి తన భటులను రావించి యిటుల నుత్తరువొసంగెను.

తోహర—1. భటులారా! రెండేఁడ్లబాలురను-బట్టి చంపిరండీ
ఔటమగు నాయాజ్ఞను జవదాటగఁ-తిరిగి నరికిరండీ.
2. జననీజనకుల విన్నపముల విని - వెనుక దీయకండీ
కనులకు గాన్పించిన మగబిడ్డలఁ - దునిమివేసిరండీ.

వ॥ అంత నారాజభటులు తదుగ్రశాసనమును శిరసావహించి రెండేండ్ల మగబిడ్డలఁ జెండివేయుచుండ పట్టణము రోదనముతోనిండుకొనియె? అక్కటకటా? యానగరమునందలి సంక్షోభనుం గనుంగొనెదను.

రాగము—హిం. ముఖారి కీర్తన తాళము ఆది.

కటకటా ? —భటులపుడేతెంచిరి — ఖడ్గపాణులై= పట పటఁబండ్లను-త్కటముగ నూరుచు చటచట ఛేదించిరి — చిన్నబిడ్డలను

1. చంటిబిడ్డలగతిఁ — గంటనుగాంచిన — మింటికెగ
యుఁ బ్రాణము॥ కట॥

2. యూదయ్యాలోని రామా — రోదనసల్పఁగ —
ఖేదముప్పొంగునోహరా! ॥కట॥

4 పడతుల దేహము — గడగడ వడకెను — బుడు
తలఁగడ తేర్చఁగ ॥కట॥

వ॥ నిరపరాధుల రక్తముఁ జిందించు నరహంతకుని దేవుడు విడుచునా? వానికా పసిబిడ్డల యుసురంటదా? కొన్ని నాళ్ళకే యా మృగప్రాయుండగు హేరోదుఁడఘోర మరణ మొందెను. ప్రియులారా దైవబిడ్డల నాశన మొనర్పఁదల పడు వారిగతి యిట్లే యుండును. దైవగ్రంథమున లిఖింప బడినట్లు అనగా

"నాకుమారుని యైగుప్తునుండి పిలిచితిని" అని చెప్పబడి నట్లు శ్రీ రక్షకుఁడు పరదేశములోనుండ నవసరములేదు గావున యోసేపునకు దూత స్వప్నంబున బ్రత్యక్షంబై యిట్టుల వక్కాణించెను.

ఉ॥ యూదులభూవిభుండు ఖలుఁ డుగ్రుఁడు దుష్పథవర్తియై రిహే
రోదుఁ డడంగె మీ కిక విరోధులు లేరు భవత్తనూజునిన్
నీదుమనోహరిన్ గొనివిశ్చలబుద్ధి నెరూషలేముకున్
కాదనకిప్పు పొమ్ము మిముఁ గావఁబరాత్పరుఁడేఁగుదెంచెడిన్

వ॥ అంత నీశుభవార్తవిని యుత్సహించి యోసేపు మరియమ్మలు యేసునాథు నెత్తుకొని

తోహర:— కడుముదమున నజరేతుపురమునకుఁ గదలిరి
వేగముతోడఁ=విడువక జగదీశుఁడు వెనువెం
టనె - నడచెను వారలఁగూడఁ

వ॥ అవ్విధమున నజరేతుకు వెళ్ళిరి. అక్కడ

రాగము॥ బ్యాగ్ —: కీర్తన :— తాళము॥ ఆది

సారమోక్షకు-మారుఁడు దేవుని
పేరిమి వడయుచుఁ- బెంపొందుచుండెఁ ॥సా॥

1. తలిదండ్రులమా-టలను గైకొనుచు
నిలను సత్కీర్తిని - వెలసెఁ బ్రభుండు ॥సార॥

వ॥ పిమ్మట నొక్కదినంబునఁ బండ్రెండువత్సరముల ప్రాయంబుఁగల క్రీస్తును వెంటగొని తల్లిదండ్రులు బస్కాపండుగకు యెరూషలేము గుడికిపోయి.

తే॥ గీ॥ పండుగలు జేసి నజరేతు పట్టమునకు
తల్లిదండ్రులు బోవుచుఁ దనయుమఱచి
యొక్కదివసంబుగడచిన । నక్కటికము
మీరఁగ్రీస్తునిగానక । మేరి వగచె॥

రాగము॥ మాండు. —: కీర్తన :— తాళము॥ ఆది.

హా ? తనయా మదిచెదరిపోయె - భీతిచే నిను వెతకి
వెదకి వేసారితి — మే తలమున జేఁరితివో - యాతనలం
బొందితివో - యీరాత్రిఁ దెలియంగరాదహా?॥ హా॥

1. కష్టురాలిఁజేయునన్ను - నిష్టమైన త్రోవఁ బోయి-
కష్టంబులపాలఁబడితివా॥ హా॥

వ. యీలాగున జననీ జనకులు దుఃఖాతురులయి కుమారుని వెదకుచు నెరూప లేమును జేరి దేవాలయంబున

సీ॥ యెరుప లేమున బ్రభుఁ । డెటగించుచుండెను
జనులకు దేవుని । ఘనసువార్త
వేదవాక్యంబుల । విస్తృతార్థములెల్ల
వివరించుచుండెను । విశదముగను
పండితవాదముల్ । ఖండించుచును దైవ
మర్మంబులను దెల్పి । మహిమఁగొనియె
మాటాడుశైలిని । మఱిప్రాయముంగని
యచ్చెరువొందుచు । నచటి జనులు
తే॥ గీ॥ ఇట్టిబోధలుమనమునఁ బెట్టివారు
చిట్టిబాలునకీజ్ఞాన । మెట్టులబ్బె
నంచుఁ దమతమ మదినిద । లంచుచుండఁ
జెలువు మీరెడి సుతుఁగాంచి । పలికెజనని.

రాగము॥ బ్యాగ్ —• కీర్తన •— తాళము॥ రూపకము

తనయనిన్ను వెదకి వెదకి-కనులు కాయలు కాచె
జనసమితినిజూడఁ- గానబడవు పుత్రా!
పనులు నిలిపి నేను-జనకుఁడున్నె గితిమి
సాకి—ధనము నీవటంచుఁ - దలపెట్టుకొంటి సుతుడా!
కనులకు నీమోముఁ - గనబడకుండిన బ్రతుక
జాలనురా॥ జన॥

వ॥ ఈలాగున బలుకరింప ప్రభువు వారితో నిట్లనియెను;

రాగము॥ మోహన —• కీర్తన •— తాళము ఆది

ఇక నేనిలమదీయజనకు - నిష్టంబగు సద్బోధలఁ
బ్రకటింపఁ బ్రారంభించెద- భయభక్తిని బ్రజాళికి
సుకరంబగు వైకుంఠము- నకు జీవమార్గంబిదె గనుడీ,

వ॥ ఇబ్భంగి నేనుండు దైవసేవఁజేయుచు జననీ జనకుల యాజ్ఞ జవదాటక వారివెంటఁజని, యన్నివిధంబుల నింటజనకు నకుసాయమొనర్చుచుండెను. ఇటుల ముప్పది వర్షముల దనుకఁ బ్రభుఁడేసుఁ డచ్చటనే గాలము గడుపుచు దైవ కృపచే బెంపారుచుండె.

—• క్రీస్తు బాప్తిస్మము •—

వ॥ యోహానను భక్తుఁడు క్రీస్తుకంటె నాగుమాసములు పెద్ద వాడుగానుండి, యోర్దానునదీ ప్రాంతమున క్రీస్తునకు మార్గము సిద్ధమొనర్చుచుఁ బ్రజలు మారుమనస్సు నొందు నటులఁ బ్రకటించుచుండె.

రాగము॥ ఖరహరప్రియ. -* కీర్తన *- తాళము॥ ఆది.

ప్రకటించెనా యోహాన్ - దైవ - సుకుమారునిరాక
సకలపాపాత్ములు దమ తమ యఘముల - నికవిడి
బాప్తిస్మము నొందుడని॥ప్ర॥

1. ననుమించిన శక్తి - మంతుడు - చనుదెంచును సరగ
ఘనుఁడగు శ్రీయేసుని చెప్పులవా - రును విప్పట
కళక్యుఁడ ననుచును॥ప్ర॥

2. జలముననే మీకు - స్నానం - బిలనొసఁగితి నతఁడు
విలసిల్లెడు శుద్ధాత్మ లోనగ్నిలో - నలరున బాప్తిస్మము
మీకిడునని॥ప్ర॥

3. తనకళ్ళమునూర్చి - గోధుమ-లను కొట్టునగూర్చి=మిన
మిన మని మండెడు యారని య-గ్నిన బొట్టును
గాల్చునని ముందుగఁ॥ప్రక॥

వ॥ ఇట్లుండ శ్రీయేసునాథస్వామి యీవృత్తాంతమెఱిగి బాప్తి
స్మమందుటకు నాతని సమీపంబునకు రాగా యోహాను

ఉ॥ ఓవిమలాత్మ యోసదయ • యోమరియాంబతనూభవప్రభో
ఓ వరభక్తవత్సలుఁడ • యోగుణశీల కృపావిలోకనా।
పావనమూర్తి యోమహిత • వైభవ భాసురభక్తరక్షణా
ఈ విటుస్నానముఁగొనెదె • యిట్టియభాగ్యునిచేదయానిధీ॥

వ॥ ఇత్తెఱంగున యోహాను నివారింప నేసుస్వామి యిట్లు
ప్రత్యుత్తరమొసంగె.

తోహర:—భూతలమున నీరీతిని మనము - నీతిని నెరవేర్చ
వలెఁ=ప్రీతిగ స్నానం బనుగ్రహించుట - కీతరు
ణము హితమనియెఁ.

వ॥ అంత నాక్రీస్తునకు స్నానికుడు బాప్తిస్మ మనుగ్రహింప
వెంటనే యాకాశము తెఱవఁబడి

రాగము॥ బ్యాగ్ —* కీర్తన *— తాళము॥ ఏకత్రిశ

దేవపావనాత్మవిభునిపైఁ - బావురమువలె వ్రాలెను
జీవనాథుండా యోర్దానునదీ - ప్రవాహమునుండి పైకిరా
గఁ॥

1. ఈతడే మదీయకుమారుండని- నూతనారావము గల్గెను॥ దేవ॥

వ॥ ఇవ్విధంబున క్రీస్తు త్రిత్వంబునొంది యచటనుండి బయలు వెడలి మహారణ్యంబుఁజొచ్చి నియతుండై చత్వారింశద్దివసంబు నిరాహారియై దేవుని బ్రార్థింప నత్తఱి యఘూకరుడగు సాతాను క్షుద్బాధితుండగు క్రీస్తునిజేరి శోధింపం దలంచి,

రాగము॥ బ్యాగ్ —✽ కీర్తన ✽— తాళము॥ రూపకము

దేవసుతుఁడవైతివేని - దేవసాయమందుచుఁ
నీవుఱాలు రొట్టెలగుట - కిమ్మనుజ్ఞనివ్వఁడే

వ॥ అన యేసుస్వామి సాతానుతో,—

రాగము బ్యాగ్ —• కీర్తన •— తాళము॥ రూపకము

పరమపితను దురితములకు - మరలుకొల్పఁదరముచే
యెరుగుదు నీ మోసమును - దరికిఁజేరకు శోధకా

1. రొట్టెవలన మానవుండు - దిట్టపడఁడుగాంచుమా
యెట్టులైన దైవవాక్య - మేమనిచెడు నరులను ॥పర॥

—• ద్వి తీ య శో ధ న •—

వ॥ పిదప సాతాను యేసుస్వామిని పరిశుద్ధపట్టణమునకుఁ గొంపోయి యచటి దేవాలయపు శిఖరమున నిలువఁబెట్టి యిట్లనియె!

రాగము బ్యాగ్ —• కీర్తన •— తాళము॥ఏక

దేవకుమారుండవైతివేని - దేవుని గుడి చివరనుండి దుముకుమయ్యా

దేవుండు దూతలనంపి - దివ్యపాదములు నేలఁ - దగుల
కుండగను సేయు - దివ్యంబుగాక ॥దేవ॥

వ॥ అందుకు క్రీస్తు సాతానుతో

రాగము॥శంకరాభరణము • కీర్తన • తాళము॥త్రిపుట॥త్రిశ్ర
సాతానా! నీ పరిశుద్ధ దేవుఁడైన - సర్వేశ్వరుని శోధిం
పక, బొమ్ము సరగ ॥సాతానా॥

వ॥ ఐహికసుఖంబుల కాధారపురుషుండగు సాతాను తన రాజ్యము నర్పింపఁజూచుచో క్రీస్తుఁడాశించి తన శోధనకు లోబడుననితలచి యీ దిగువరీతిని మూడవసారి శోధించెను

—• తృ తీ య శో ధ న •—

వ॥ పిమ్మట సాతాను శ్రీయేసునాథ స్వామివారి నత్యున్నత పర్వతముపై నిలుపబెట్టి యిట్టులనుచున్నది.

రాగము॥ హిం.తోడి. • కీర్తన • ఆది॥ రూపకము.
కనుమీ రాజ్యం-బునుమహిమయు మరి-ఘనముధనము
కనులపండువౌనరంచెదు - వనముల నలమోదుమేడలు
నను గొని యాడుచును పాద - మునబడి మ్రొక్కిన
నొసఁగెదఁ ॥ గను ॥

వ॥ పిశాచితంత్ర రాజ్యవైభవము నాశింపని యేసుక్రీస్తుస్వామి వేదగ్రంథమునందలిసత్యంబుల వచింపుచు నీరీతినిగద్దించెను.

రాగము॥ కళ్యాణి • కీర్తన • తాళము॥ రూపకము.
సాతానా సామికినమస్కృతిజేయు - వేదంబున దెల్లం
బుగ లిఖింపబడె=

నీతియుఁ దప్పియు నన్నిటఁ - బాతకమున ముంచ నేగితివా
జ్యోతుల జనకుని సుతుని - మతిని జెడుగతిఁ మరల్పఁ-
జేతనౌనె ? - పాతకుడా! బరుగిడుమికఁ - బ్రభున్ను
తించుచు ॥సాతానా॥

వ॥ జగదీశ్వరుసుతుఁడగు యేసుఁడీ మూడుశోధనంబుల దైవ
త్వముఁ బ్రయోగింపకనే సంపూర్ణమానవుండుగా నుండి
ప్రార్థనా వేశమువలన స్థిరుఁడై జయించెను.

—• శ్రీ యేసునాథు సామ్రాజ్య స్థాపనము •—

ఉ॥ భాసురలీలఁగ్రీస్తు సమ • భావముతో నజరేతువాసమం
దాసను ముప్పదేడులట • నర్మిలినుండి సువార్తఁ దెల్పగా
వాసికి నెక్కు జాలరుల • వాంఛితముల్ దయనేయ నెంచిగ
న్నేసరె దబ్ధితీరమున • నేర్పెనగఁ నివసించె ధీరుఁడై

వ॥ ఒకానొకప్పుడేసు గలిలయ సంద్రతీరమున బహుజనసమూ
హమునకు బోధించి చాలించిన పిదప వలలఁ గడుగుచున్న
బేస్తవాడగు సీమోనును ప్రభువుకని.

రాగము. బ్యాగ్. • కీర్తన • తాళము రూపకము.

పడవనిప్పుడే - కడలి నడిమి భాగమున కిఁక - వడిగ
నడుపుచు - వలల వేయుము=
తడవు సేయవలదు నాదు - నుడి నెదనమరించి
విడువక నియత్నమును - వేగ సాగనిమ్ము ॥ పడవ॥

వ॥ అంత సీమోను.

రాగము॥ బ్యాగ్.   • కీర్తన •   తాళము॥   రూపకము.

సదయహృదయా - నిదుర లేక - సంభ్రమున రాత్రి
వెదుకఁగఁ జేప - లెదురుపడవయ్యెఁ
బదిలముగ నీయాజ్ఞ నిప్పు- డెదనిడుకొని వలల - నిదిగో
వేయుచుంటిని నే - ముదముతోడుతఁ ॥ స ॥

వ॥ ఇప్పగిది సీమోను యేసు చెప్పిన చొప్పున మధ్యసముద్రం
బున వలల వేయ మత్స్యంబులు దోనెలు రెండు నిండు
నట్లుగాపడెను. పిదప సీమోనుయు నాతనితో నున్నవారు
నా చేపలరాశిని కని విస్మయచిత్తులైరి. సీమోను బిరబిరఁ
బరుగిడి యేసు పాదపద్మంబుల ముందఁ మోకాళ్ళూని
యిట్టులఁ జెప్పదొడంగె.

రాగము॥ శాహన.   • కీర్తన •   తాళము॥ రూపకము.

ప్రభువా నన్విడిచి పొమ్ము-పరమపాపిని
ప్రభలీనుచుండు నీదు-పజ్జనిలువఁజాలను ॥ ప్ర ॥

1. స్తోత్రార్హుఁడ నీదుకీర్తి - ధాత్రిఁబ్రియముగా
శ్రోత్రోత్సవముగ జనులు - స్తుతింపఁజాలుదు ॥ ప్రభు ॥

వ॥ ఇవ్విధంబున భీతిల్లుచుండ సీమోనుతో నేసుఁడిట్లనియె.

తోహర॥ 1. ధీవరులారా! భయముఁ జెందకుడు - దెల్పెద
మోక్షపుత్రోవ॥
భావములందున నమ్మియుండుడు - ప్రభువర్యుని
సేవ.

2. సమ్మతమున ననువెంబడించుచో - సత్వరమున
మిమ్ము=నిమ్మహిమనుజులఁగొను జాలరులుగ -
నెమ్మినిజేసెదజుమ్ము.

వ॥ వెంటనే సీమోనుయు నాతనితో నున్నవారును సమస్త
మును విడిచి యాయనను వెంబడించిరి.

—• క్రీస్తును గూర్చిన ప్రవచనము •—

వ॥ ఒకప్పుడేసు దేవాలయమున కేగగ యెషయా లిఖించిన
ప్రవచనగ్రంథ మాయన కొసంగబడె దానిదెరువగ దన
విషయము వ్రాయబడియుండుటఁ గనుంగొని జదువ
నారంభించెను.

రాగము ఫార్మీమట్టు —• కీర్తన •— తాళము ఆది.

ఘనుఁడగుదే - వునినియమములఁ - గనుఁడీ జనులారా
రహిని - వినుడీ॥ ప్రభువాక్కుల భువిని =
జనులతిదుఃఖం - బున జెరనుండగఁ
గని వారల రక్షింపఁగ - నను బంపెౕ
గనికరమెదస్థా - పనమొనరించి - గడు బీదలబ్రో
చెనఁ గాంచి॥ ఘను॥

1. ఇల బీదలమన - ములు వికసింపఁగ
విలసితమగు సువార్తను జాటుచునం-
ధులఁగనినయనం - బుల నొసఁగుచువా
రలబ్రోవగన - న్నిలకంపెౕ॥ ఘను॥

వ॥ ఇట్టి సత్యవాక్యంబు లాలించి జనులచ్చెరువొంది కొందరా యన నామోదించుచు మఱికొందరాయన జనకుండగు యోసేపు పేరు నెత్తుచుఁదిరస్కరింపసాగిరి. పిదపయేసు స్వామి యే ప్రవక్తయుస్వదేశమున హితుఁడు కాడని పలికి,

—* దయ్యమును వెళ్లగొట్టుట *—

వ॥ వారినివిడిచి గలిలయలోని కపెర్నహూమున బ్రవేశించి విశ్రాంతి దినమున బోధింప నారంభించెను. ఆ సమాజ మందిరంబున నపవిత్రాత్మావేశకలితుడైన మనుజుండొకఁ డేసును కని గడగడ వడఁకుచు

రాగము॥ కాఫీ. —* కీర్తన *— తాళము॥ రూపకము

పరమపరిశుద్ధుఁడవని నే - నెరుగుదుఁ బరమేశా

నరగణమ్ము నశింపజేయ - నరుదెంచితివా। యేసయ్యా

తరుణాహృదయా - మమ్మ్నెవుడె?- బరిమార్చకుము-పర

వ॥ అందులకేసు స్వామి

రాగము॥ కాఫీ —• కీర్తన •— తాళము రూపకము

మారుమాట వల్కకనే పారిపొమ్ము సాతాన్

క్రూరహింసఁ జేయువానిఁ - జేరితివా హంతకా

ఘోరనారకాగ్ని వాసా - గొబ్బున బొమ్ము॥మా॥

వ॥ వెంటనే సాతాను యేసు నాజ్ఞకు విధేయుండై యాతని బడ ద్రోసి హానిగావింపక వదలిపోయెను. యిట్టి అద్భుతకా ర్యముఁ గన్నులార గాంచిన పురజనులెల్లఱు విస్మయ మొంది బొగడదొడగిరి.

రాగము॥ యమున —• కీర్తన •— తాళము॥ రూపకము

ఎట్టివింతఁ గంటిమిప్పు - డెంతటి ఘనవంతుడేసు=పట్టియుం
డదయ్యుముఁగని పట్టుదలతో సాగనంపె ॥నెట్టి॥

వ॥ పిదప యేసునుగూర్చిన సమాచారమా ప్రాంతములందం
తట వ్యాపించెను.

చ॥ ఘనుడగు యేసుకార్యములఁ • గాంచి ముదంబునమూర్ఛ
రోగులన్

వినికిడిలేనివారలను • వెండియు నంధుల మూగివారలన్
చనుటకుఁగాళ్లులేకదిగ • జారుచుఁ బ్రాకుచునుండువారలన్
గొని యాలయేసుచెంతనిడ • కూర్మి నిరోగులఁజేసె నందరిన్.

వ॥ శ్రీ యేసునాథుకడకు గలిలయ, దెకపొలి, యెరూషలేము,
యూదయ్యులను విషయంబులనుండి జనులేతెంచిరి. అంతఁ
బ్రభుండు వారలఁగని సమీపంబునగల యొక యున్నత
పర్వతంబెక్కి గూరుచుండ దన శిష్యులాయన జెంత కేతెం
చిరి. లంత క్రీస్తుడీవిధమున బోధింపసాగెను,

సీసమాలిక॥ దైవాత్మఁ గొనియాడ • భావంబున శ్రమంబు
నమరువారలె ధన్యు • లాకసమున
ఖేదమందెడు వార • లోదార్చబడుదురు
సాత్వికుల్ ధన్యులై • జగతిగాంత్రు
నీతి నపేక్షించు • నిజభక్తవరులిటఁ
దృప్తినొందుదురు సత్ • ప్రాప్తినొంది
గనికరహృదయులు • కరుణింపబడుదురు
శుద్ధచిత్తులు ధన్యు • లిద్ధరిత్రి

నీతికై హింసలు • నిజముగానందెడి
వారుగాంతురు మోక్ష • వాసమహహా
నామీఁది భక్తిచే • బాములందెడి వారు
పరలోకమున ముక్తి • బడయఁగలరు
పరహత్యలనెడు న • న్యాయంపు కృత్యముల్
దొరగియుండుడి మీరు • దొడ్డమతిని
వ్యభిచార దుర్నీతి • వ్యవహారములుమాని
ప్రేమింపు డితరుల • ప్రియముమీర
తే॥ గీ॥ ధరకునుప్పుగనుండియుఁ • బరమపితను
సతతమును నీతియుతముగ • నుతులొనర్చి
హృదయపద్మంబు దేవుని • సదనమంచు
బ్రతుకుడని కొండపైఁజెప్పెఁ • బ్రభువరుండు.

వ॥ అంత కొండదిగి వెళ్ళుచూ మార్గమధ్యమున నొక కుష్ఠ రోగిని స్వస్థపర్చెను.

—• ప్ర భు ప్రా ర్థ న. •—

(మత్తయి 6:10—15)

సీ. పరలోకమందున్న • పరిశుద్ధజనకుండ
నీపేరు శుద్ధమై • నెగడుగాక
భవదీయరాజ్యంబు • పరగవచ్చునుగాక;
దివియందు నెట్టులో • భువినినట్లు
నీదుచిత్తంబును • నెరవేరుగావుత
మా దినాహారమ్ము • మాకునిమ్ము

మాఋణస్థులమేము • మన్నించుచోవ్వన
మన్నించుమోతండ్రి • మాఋణములు
తే॥ గీ॥ మమ్ము శోధనమునకీవు • మరలనీక
కీడునుండి తప్పించుము • వేడుకలర
మహిని రాజ్యమ్మును బలమ్ము•మహిమమునుని
రంతరమ్మును నీవియా • ద్యంతరహిత.

—• తు పా ను న ణ చు ట •—

క. కడునలపుఁజెంది యొడయఁడు
కడలినిదాటుటకు శిష్య • గణములతోడన్
పడవను బోవుచునుండగ
సుడిగాలియు వానరేగి • సుడివడుచుండెన్.

వ॥ ఆసమయంబున శిష్యులు భయభ్రాంతిచే నిద్రించుచున్న యేసుఁగని

రాగము హరికాంభోజి —• కీర్తన •— తాళము॥ ఆది

ప్రభువర్యా! యికలెమ్ము - ప్రవిమలచరితా లెమ్ము=
అభయంబిడ మేల్కొనుము - అభిమతమున గాచు
మము-నభివందనముల - నర్పింతుము గడు-శుభముగ
రక్షించు మహాత్మా ॥ ప్ర॥

1. తుపాను బలంబుఁగొనె - నపాయముఁగల్గునయో =
ఉపాయముఁ జూపుమయా - కృపాళుఁడ యీ
క్షణమే= కృపఁజూపగలె - మ్మపవర్గాధిపా - అప
చితుఁడా వే మేల్కొనుము ॥ ప్ర॥

వ॥ అంత ప్రభువు లేచి

రాగము॥ బ్యాగ్. • కీర్తన • తాళము॥ ఆది

ఇంతలో మీ నమ్మికవిడిచి - యింతలో మీ నమ్మిక
విడిచి = చెంతనుండిన నన్నిటమఱచి చెంతనుండిన
నన్నిటమఱచి చింతనొందుటఁ దగునా ! నెఱచి=వింత
లీధరఁజూపితి - నుంతయైనను దలచితిరా ? ॥ఇం॥

లోకమంతటి నేలెడుశక్తి - లోకమంతటి నేలెడుశక్తి -
నాకుఁగలదని దలఁచుట లేదా? - నాకుఁగలదని దలఁ
చుట లేదా - శోకమొందెద రేటికిమీరల్=యీకడలి
ఘోషనడచి - శోకముఁ దీర్చెద నీక్షణమే॥ఇం॥

వ॥ ఇట్లనుచు సముద్రమును, గాలిని గద్దింపగా సమస్తము
శాంతంబునొంద శిష్యులు నమస్కరించిరి.

—• ఐదు వేలమంది కాహార మనుగ్రహించుట •—

తోహార—1, ఒండొక దినమున నేసునాథుఁడొ - క్కం
డడవికేగెఁ = నిండుముదంబున జనసముదా
యము - నీతులు విన నేగిరి వేగెఁ.

2. వారలభక్తికి సంతసించి య - వ్వారిగాను
కృపనుంచి = జేరఁదీసి సద్బోధలొనర్చెను -
చింతలెల్లఁ దొలగించి=

వ॥ అంత సాయంకాలంబగుడు శిష్యులాయన కడ కేతెంచి

రాగము భ్యాగ్. —• కీర్తన •— తాళము ఏకత్రిశ్ర.

ఈనరులనిండ్లకింకఁ - బోనిమ్ము వేళమించెఁ=
గానన స్థలము నభో - జనంబు జిక్కదకటా?-
ఓనాధ! బోధనాపి - జానుగననుపుము వారిన్ ॥ఈ॥

వ॥ అని విన్నవింపగా నందులకేసు

రాగము॥ బ్యాగ్ —• కీర్తన •— తాళము ఏకత్రిశ్ర.

మీరే జనంబులకా - హారమనుగ్రహించవలె=
నీరీతి క్షుద్బాధను - భరించి బోధవినిన -
వారల నెటులంపెదరు - పేరిమి జూపరెమీరల్ ॥మీ॥

వ॥ అంత శిష్యులు,

రాగము బ్యాగ్ —• కీర్తన •— తాళము ఏకత్రిశ్ర.

ఏలాగు నైదురొట్టె లీరెండు చేపలనీ=
వేలాది ప్రజలకొసగ - వీలౌనో? దెలుపుమీశా-
జాలంబు సేయకనీ - జనులనిండ్ల కంపుమయా॥ ఏ॥

వ॥ ఇట్లాశిష్యులుబల్క ప్రభువరేణ్యుండు వానిఁదెప్పించి ప్రజల
నందఱ వరుసలుగ బారులుదీర గూర్చుండ నియోగించి
యైదురొట్టెలను, రెండు చిన్నిచేపలను జేతనంది

ఆ॥ వె॥ కనులు దెరచి మిన్నుఁ • గనుగొని దండిక
మనవిఁజేసి మ్రొక్కి • వినయమునను
అక్షయంబటంచు • నాశిషంబులనిచ్చి
పంచిపెట్టుడనుచుఁ • ప్రభువొసంగె॥

వ॥ ఇట్లొసంగ నాపదార్థంబులఁ బంచనమాత్ర పరిమితులగు జను
లారగించి శేషించినదానిని పండ్రెండు గంపలకెత్తిరి.

—*నాయీానను గ్రామమున నొకవితంతుసుతుని బ్రతికించుట*—

వ॥ ఒకప్పుడేసు నాయీానను గ్రామమునకు బహుజన సమూహ
ముతో వెళ్లుచు నాయూరి గవినికడకు సమీపించినపుడు
మృతినొందిన యొకవిధవరాలి సుతుని వెలుపలికి మోసి
కొని పోవుచుండిరి. ఆ విధవ కత డేకసుతుండు గావున
ఘోరున నేడ్చుచు పాడెవెంబ డరుగుచుండె. ప్రభు
వామెను వీక్షించి,

క. వనితనుకని కనికరమున
తనయుని బ్రతికింపనెంచి • తానాపాడెన్
తన కేలందాక బాలుండు
జనులాశ్చర్యంబుం జెందం । జయ్యన లేచెన్,

వ॥ అంత నాతని జనని గ్రీస్తు పాదంబులపైంబడి యిట్లు స్తుతిం
చెను.

రాగము. మధ్యమావతి,—• కీర్తన •— తాళము రూపకము

ఓ! దయాసాంద్రమా! - మోదమలర నీదుపాదపద్మ
ముల భజింతును=
నాదుపుత్రు నొసగినావు - పేదగృహము నిలిపినావు
మేదిని నినుదలంచుచు రహిం - నీదుగీర్తిం జాటెదన్.

—• ర క్త స్రా వ రో గ ము గ ల స్త్రీ •—

వ॥ సమాజమందిరపు టధికారియగు యాయీారు కనిష్ఠ పుత్రి
కను స్వస్థపరుప నేసుస్వామి చనుచుండ జనసమూహము
లాయనను వెంబడించిరి. మార్గమున పండ్రెండేండ్లనుండి

చ॥ రమణియొకర్తుదారుణత • రంబగుదుర్భర రక్తపూరని ।
ర్గమమున బాధంజెందుచున • ఖండదయానిధి యేసునాధువ

స్త్రీమునతిభక్తి నంటనిముసంబున స్వస్థతఁజెంది యేసునా।
మముఁగొని యూడుచుఁ జనియె మానవులెల్లరునిల్చిచూడఁగన్.

తోహార ◆— 1. వెంటనె దనలోనుండు ప్రభావము - నెలువ
డెనని ప్రభుడెరిగెన్
అంటెను మనుజుండెవడో యనితా। పచ్చ
టివారల నడిగెన్.

2. ఒడయుఁడు నుడివినమాటలు వెంటనె। వడ
తుకయుట నాలించెన్
గడగడ వడకుచుఁ - బ్రభుపాదంబులఁ। బడి
జరిగినది వచించెన్.

వ॥ ఎట్లన

రాగము. హిం. తోడి. ◆ కీర్తన ◆ తాళము. రూపకము

విన్నపమ్ము గైకొనుమో ప్రభువా। నీ-కున్న యోచ్యత-
లన్ని రీతుల దెలిసికొంటినయ్యా=నిన్నంటఁగ నాసంకట-
మన్నా। నిర్మ్మలమాయె - నెన్నోవిధముల ధనంబు-
నెలమిన్ వైద్యులకొసఁగుచు - ఖిన్నత్వముఁగొం
టిని ॥విన్న॥

వ॥ అంత యేసు

తోహార◆— ఓ కుమారికా! నీ విశ్వాసము - హాయన
నిన్నురక్షించెన్ = ఈకడ నిలువక కంటికి
బొమ్మని - హితములెన్నొ బోధించెన్.

—◆ పదుగురు కుష్ఠరోగులు స్వస్థులగుట ◆—

౪. పదిమంది కుష్ఠరోగులు

ముదమున విచ్చేసి క్రీస్తు ◆ ముందెనిలిచి వే

డ దయాసాంద్రుండప్పుడె

పదిలంబుగ స్వస్థపరచ • వంపెన్ వారిన్.

తోహర:— స్వస్థతనొందినవారిలో నొకడు - స్వామి

చెంతకేతెంచి = ప్రస్తుతించెనివ్విధమున ప్ర

భుపద - పద్మంబుల మదినుంచి.

రాగము. హిం॥ తోడి. • కీర్తన • తాళము. ఆది.

వరలోకనాథా! - మరియసుతుఁడా!!- మరువగనో నే-

ధరను నీప్రేమన్=చిరముగను నీ - వరమహాత్మ్యము-

నరుసముగఁ బ్రకటించెదన్ - నరులు నాశ - రీరముఁ

గని - పరమహర్షమందిరి ॥ వరలోక ॥

1. యిష్టముగ నీ-దృష్టి నాపయి - నుంచ గుష్ఠికఁబోయెను

నష్టమయ్యె నాదుమతికి - సృష్టికర్తవీవని ॥ వర ॥

వ॥ సోదరులారా! మానవులెల్లరు పాపభారమున మూల్గుచు నరకదండన నొందకుండునటుల శ్రీ యేసుక్రీస్తుస్వామికరుణా హృదయుండై యివ్విధంబున పిలుచుచున్నాడు.

క. పాపపుభారము మోయుట

కోపక శ్రమఁజెందుచు । నుక్కివులారా!

తాపంబు మాన్పివేగమె

గాపాడెదరండు మీదు । కలుషములడఁగన్.

వ॥ ఈకృపఁగల పిలుపు నంగీకరించి క్రీస్తును హత్తుకొను మనుష్యుఁడు ధన్యుడు.

—• యేసురక్షకుఁడు శిష్యులపాదములఁ గడుగుట •—

వ॥ దైవనందనుఁడు శత్రువులగు యూదులచేఁ జిక్కుబడక మున్నొకనాటినిశీథమున శిష్యులతోఁగూడి భుజించుటకై

ముందుగా వారి చరణంబులఁ గడుగుచు పేతురు సమీపంబునకు రాగా నాతడిట్లనియె.

రాగము॥ యమన్. • కీర్తన • తాళము॥ ఆది.

దురితరహితా! - కరుణకలితా॥ - నలరువిహీ॥ - సరసజననుతా!!!! = దురితదుర్గతుండగు నాదు - చరణములఁ గడుగంగసరియా? ॥ దురిత ॥

వ॥ అంత నేనుస్వామి

రాగము. యమన్. • కీర్తన • తాళము ॥ఆది.

నేనొనర్పు కార్యమిప్పుడు - నీవెరుంగవో నీమోను- నేనునిన్ను గడుగకున్న-నీకునాదుపాలుసున్న ॥ నే॥

వ॥ పిమ్మట పేతురాతురమున

తోహర•—తక్షణమే నా పదములఁ జేతులఁ-దలను గడుగు మోక్షప్రభువా! = మోక్షంబున లభియించెడు నిత్య - మోదముఁజూపుము చేవా!!

వ॥ అంత ప్రభువు స్నానముచేసినవాడు పాదములుతక్కమరే మియు గడుగనక్కర లేదని ప్రత్యుత్తర మొసంగిన పిదప పరిచర్యచేయుట విషయమిూ దిగువరీతిని హెచ్చరించె.

రాగము జంఝూటి. —• కీర్తన •— తాళము ఆది.

ధరఁబరులఁగాంచి సతము సేవ - దయతోఁ జేయుడీ- ధన్యులగుదు రాహాహా?=పరమాత్ముఁడగు నేమిాదు- చరణంబులం గడిగితిని = స్థిరమోక్ష సౌఖ్యమునొంద సరియైన సాధనమిదియే? ॥ధర॥

—* గెత్సెమనేవనము *—

వ॥ ఇట్లు యేసుక్రీస్తుఁ డచ్చటచ్చటఁ దన మహిమ లోకంబు

నకుఁ జూపించుచు దేశమంతయుఁ దిరిగి సువార్త ప్రకటించి గెత్సేమనేతోటకు పేతురు, యాకోబు, యోహాను అను ముగ్గురు శిష్యులతోఁగూడి చని యందొక పరిశుద్ధస్థలంబున తాను బోరగిలఁబడి దేవుని ప్రార్థించుచుండె.

రాగము భ్యాగ్. —• కీర్తన •— తాళము. ఆది.

కటకటా కావవేతండ్రీ! - యీబాధ సహింతునీభరము
కుటిలాత్ముల కఠిన - కుటిలముల సే- నెటులభరియింతును
సాటసాటవోపక నీయు - త్కటమగుబలమిమ్ము యటు
దోచదాయ జనకుండా! - యీబాధఁ దొలఁగింపుము
వేగ ॥ కట ॥

1. నాచిత్తముగాదు జనక! - నీచిత్తము సిద్ధించుగాత
నీచమగు నీపాపస్వాత - మోచికొని తిరుగువాడ
నాచిన్నమునను దయసేయుమా - సహింపసత్వము నో
సఁగుమా ॥ కట ॥

వ॥ ఇవ్విధంబున నేసుప్రభుఁ డొంటరిగా చమట రక్తబిందువులవలెఁగారఁ బ్రార్థించి నిద్రించుచున్న శిష్యులఁగాంచి యిక మేల్కొని శోధనలోఁ బడకుండునటులఁ బ్రార్థింపు డిదిగో సమయము సమీపించెను. మనుష్యకుమారుడు పాపుల చేతికప్పగింపఁబడుచున్నాడని యెఱిగించి యూదాయిస్కారియోతు, రాణువవారితో చనుచుండ యేసుఁడాతని వీక్షించి శిష్యులతో

రాగము॥ భ్యాగ్. —• కీర్తన •— తాళము॥ రూపకము.

అదుగో! భటులేతెంచిరి నీ - న్నడపుటకు న్నుద్దేశులై

గుడియలు ఖడ్గములఁగొని న - న్వెదకుచు నెదురుగ
నిలిచిరి ॥ అదిగో ॥

1. దొంగవానిఁగని పైబడు-భంగిని పన్నిపుచువారు - భం
గము సేయను దలచి - బయలు వెడలి నక్కటా ॥అ॥

వ॥ ఇటుల నేసుఁడు చెప్పుచుండఁగా నిష్కార్యోత్తను యూదా బెట్టుగఁజని ముద్దిడఁగా ప్రభునాథుండు.

రాగము॥ భ్యాగ్, —• కీర్తన •— తాళము॥ ఆది.

ధనమిలనాశించియు నీవిధ - మున రాత్రివేళ ముద్ది
డుచు=ఘనముగ నీపగతురకు - మనుజకొమరు నప్ప
గించుటఁదగునా ॥ధన॥

వ॥ అంతనాటి నిశీధిని

రాగము॥ ఫార్సీమట్టు —• కీర్తన •— తాళము॥ రూపకము.

పాపాత్ములపుడు యేసు - పైనిబడు నుమియుచును
గోపంబుచే ముండ్లు - కొరడాలతో గొట్టిరి ॥పా॥

1. కనులకు గంతగట్టి - కాలు చేతులను దన్నుచు
నినుగొట్టి నరుని - గనుగొనుమనిరి ప్రభుకా ॥క॥

వ॥ ప్రధానయాజకులును శాస్త్రిలు నాయసప్పైఁబడి నేరమారోపింప నబద్ధ సాక్ష్యము వెదకుచుండిరి. అబద్ధసాక్ష్యులనేకులువచ్చినను సాక్ష్యము దొరకకుండె. తుదకిద్దఱు మనుష్యులరుదెంచి యిట్లుచెప్పినను పటుత్వము లేకపోయెను.

క౦॥ నాడీతఁడె దేవళమును
బాడుంగావించి కట్టు • వాడను నే మూ
నాడులలోనని బలికె
తేడుననుచు నెంతొ పాత । రించెనతండే.

—• పిలాతు తీర్పు, •—

వ॥ ప్రాతః కాలమున ప్రభువును పొంతి పిలాతు సన్నిధికిఁగొని పోగా నతడేసునిగని

ఉ॥ యూదుల రాజచంద్రునిగ, నుద్భవమొందిన వాడ వీవయా కాదని యందువా ప్రజలు • క్రమ్మఱినిన్ను ద్రుమింత్రుసుమ్మనీ మీఁదనుదప్పులెన్ని తమ • మానముదీటుచు వాదులాడగా వాదముసేయవయ్యె ప్రభు • వర్యుఁడవై సభాముఖంబునన్

వ॥ అంత ప్రభువు,

రాగము జంఝూటి. కీర్తన తాళము త్రిపుటత్రిశ.

నీవన్నట్లే నేనే యూదులరాజు - నీవసుంధర నిక్కంబు గనో పిలాతు।

యీవిధమున నన్ను బ్రశ్నింపగా - నేమిఫలంబుత ంచు పిలాతు

వ॥ పిదప

తే॥ గీ॥ జనులు క్రీస్తునెటులయిన • జంపదలఁచి
లేనిపోని నేరంబులె • న్నెనిమోపి
హీనముగ దూఱితుదకు స • హింపరాని
సిల్వపైఁజంపఁదీర్పు • జేసిరకట?

వ॥ యేసును పిలాతుసిలువవేయుటకు యూదులకప్పగింపగా

రాగము॥ కాఫీ —కీర్తన— తాళము ఆది

ఒడయు నొడులుపై నెఱ్ఱనంగని - దొడంగి కుడి కర మున రెల్లునిచ్చి=కడకు శిరంబున - వడిముండ్లదిమి - గొడుజెండఁగ - తేడ బలుకవదేలనంచుఁబ్రభు న్ - బొడిచిరి - వేడుకలారన్॥ఒడ॥

వ॥ ఇత్తెఱంగున

చ॥ శిలువను బెట్టి వీపునను • చేతులఁ గాళ్లను దన్నుచుఁ గవడిన్
గలువరి గుట్టకున్ జనుమ • కాలము దప్పెను వేగమంచు దా
రలసటఁ జెందితిట్టుచున • హంకృతిఁ బైనుమియంగ నాతఁడున్
బలుకడు గోపగింపడు కృ • పావరుఁడై పరిపంథివర్గమున్.

వ॥ అంతఁ గొందఱు స్త్రీలు శ్రీయేసు భరించుచున్న బాధ గని
నేడ్చిరి.

రాగము॥హిం॥తోడి —* కీర్తన *— తాళము చాపు

అయ్యొ యేసయ్యా నీ బాధఁ జూడలే - మయ్యా
మే మొకనిమిషంబైన = నియ్యుర్వి నీవొనరించిన సత్క్రి-
య - లేనిన్ను బాధింపసమకట్టెను ॥అయ్యొ॥

1. నీయందుగల నిత్యజీవమిదు నీతి - న్యాయంబుగని
నోర్వజాలక - మోయంగరాని శిల్వను మోయఁబగ
తురు - మూర్ఛిల్లఁ గొట్టుచున్నారా? ప్రభో! ॥అయ్యొ॥

వ॥ ప్రభువు ఖేదమందుచున్న స్త్రీలనుగని

రాగము॥ హిం తోడి—• కీర్తన •— తాళము॥ రూపకము

పరితపించెద రేటికిటుల - నెరుప లేము సుదతులార !
దురితభరితులైన మీకొ - మరులకొఱకు నేడువుడి
కరుణగల దేవుని నియముఁ - గనుఁడీ॥ పరి॥

వ॥ పిదప గష్టంబుసి గొల్గొథా మెట్టకు జేరగా

చ॥ తులువలు యేసునాయకుని • తుచ్ఛునిగా నెదనెంచి
సూదిమేకులఁ గరపాదపద్మములఁ • గ్రుచ్చిపకాలుఁనన
వ్వుచున్ ప్రభో పలుకవదేలనంచుఁ బ్రభు • వర్యునిసి

ల్వాకునంటఁగొట్టఁదా। నలుగకతండ్రి। వీరినిద• యామతి
ప్రోవెమఁటంచు వేడెబో.

వ॥ క్రీస్తుబాధనొందుచు నలసటచే దేహమునుండి ప్రసరించెడు రక్తబిందువులు చమటగా మారెను. మన పాపముల విషయమై నలగగొట్టబడిన యేసుస్వామి నించుక దలఁపుడు

రాగము॥ శంకరాభరణము. —• కీర్తన •— తాళము.

మనమునదలచుఁడి దైవతనయుని నేడు - తనకాయం
బిలఁ - దునియలుజేసి - కొనెను గల్వరిపై =
మనయఘంబుల నడఁపఁగూర్మిచే - ఘనుఁడు హంతకుని
గనెన్నబడుచు - కనికరము లేని యూదులుచుమియఁగ
కినుకనొందక నిలువబడియెను - తనదత్తాపించిన పగతు
రగోటకదీర • వినయమునుజూపెగా ప్రభుండు॥ మన॥

1. సిలువపై నేనుండు - పలికిన యేడుమా - టలి ప్రభా
వమువర్ణన సేయఁదరమె నరుకిలఁ=
గలతనొందుచుఁ - పావకము న్నె - తులువలనను జాలి
తోక్షమియింపగఁ - బలువిధములుగఁ దండ్రిని వేడెను
యలుఘుఁజెందగ దేవునిసాయము - బలముగ నడుగుచు
నంతమయినదని పలికి - కలితనముగల యాత్మ్వనీడెగా
మన॥

2 సురుచిరమైనక - ల్వారిగిరి చీలుట - నగలు భీతిచే
పరుండియేడ్చుట - మరువవీలౌనా =
మఱియు గుడితెర - బరబరమని - చినుగుటయు
భూకంపము గల్గుట - తెరువబడిన సమాధులలో నవా।
పరిశుద్ధులమూకలు గూడుటవర - పరమకుమారుండని

తెలియుటకిది పదవి - మరియునందనుడే రక్షకుడు॥
మన॥

క॥ యేసుని మరణము నిజమో
మోసమొ కనుగొనదలంచి । యోధుడొక్కం
డీసున నీటెన్ బొడువగ
కాసిలగాయంబునుండి • గారెను జలముల్.

తోహార — ఒడయుండు మృతిజెందగ నేగుడితెర - నడి
మికిఁజీలెగదా - పుడమియు గిరులును దక్షిణమ
యమో - గడగడవడకెగదా.

2. ఆకసమునగల రవి దాగఁగఁడు - చీకటి క్ర
మ్మెఁగదా - శ్రీపతుఁడగు క్రీస్తుఁడు దేవుండని -
లోకమెఱింగెఁదదా.

వ॥ సిలువమ్రానుపై వ్రేలాడుచున్న క్రీస్తును చూచియమ్మ కని
యిభ్భంగి నేస్తోకనుండునా

సీ॥ కొడుక నీవిట్టుల • క్రూరాత్ములకుఁ జిక్కి
యిడుములందుదూవఁచు • నెరుగనైతి
ఘనుడైన సిమ్యోను • నినుగాంచి నాతోడ
నుడివిన నుడులు నేఁ • దడవనైతి
చిఱుతి వజ్రముఁబోలు • నీవ్యాగొట్టినవార్త
మనమునరిచ్చవడంగ • వినగనైతి
నినుజంపదలచిన • జనులకిన్నులుచల్ల
గానుండగా వారిఁ • గాంచనైతి
తే॥ గీ॥ నిట్టి నాజీవితంబును • మట్టుబెట్టు
కున్నవాడయ్యెఁ గట్టడి • మన్నెఁ గాదు

యెందుఁజొత్తును నికమీద • నేరితోడి
జెప్పికొందును గతియేమి • చిన్నికుట్టి.

వ॥ మిత్రులారా

ప్రభువు మరణమును జ్ఞాపకముఁ జేసికొనుడి.

రాగము॥ హిం. ముఖారి. —• కీర్తన •— తాళము॥ ఏక.

చావుగలైనె - దేవుని సుతుఁడగు యేసున కీవసుధను
భావమునసుంతయైనఁ - బాపదీక్ష లేని ప్రభునకి రొా?
చా॥ దైవవాగ్దత్తముల - త్రోవఁబోనఁ దోచకుండి
కావరించి - దేవుని దొలగించి
యీవసుధఁజరించుచు - హీనుఁడనై యుండగా నకటా॥
చావు॥

రా॥ యమున, —• కీర్తన •— తా॥ రూపకము.

ఏమియద్భుతము - యేసయ్యప్రేమ - నామహిమ=
కామాతురతి - లోమలంగి - పామరులను బేరజెలగుఁ-
తాపసులను ప్రోవధరకుఁ - జేరువిధముమదినియరయ ॥ఏ॥

1. మనుజకోమరుఁ-డనుయంకితముఁ- దనువుపై నిల్చికొనితన-
ఘనముఁబొటింపకనునీచ - జనులగిదిసిమనుటనరయ॥ఏ॥
2. మానవాళి - మానసముల - మర్మమున బిశాచి చెరువఁ-
బూనియుండుతరి శుద్ధాత్మ-జ్ఞానమంపిజయ మొనర్చుట ॥ఏ॥
3. పావ మనియెడు - పంకమునబడి - పాపు లెల్లరును సుస్థితి -
మాపు జేసికొనగఁ బ్రభుస్వ - రూప మిడి యుత్తములుగ
నొనర్చుట॥
4. ఇలనంతసమున-ఖలులకొరకు-శిలువపై బ్రాణములనిడియు-
సలలితమగు మోక్షమందు-స్థలముసిద్ధ మొనర్చుటఁదలఁప॥ఏ॥

వ॥ నాటి సాయంత్రంబున శిష్యులు పిలాతు సెలవుఁబొంది,

క॥ సన్నుతమగు ప్రభుదేహము
సన్నపు వస్త్రములఁజుట్టి • సరగసమాధిన్
దిన్నగ నునిచిరి శిష్యులు
ఖిన్నులగుచుఁబోయి రంద • ఖలజనులుగనన్,

వ॥ పిమ్మట ప్రధానయాజకులును, శాస్త్రులుపిలాతునుదర్శించి

తోహర.— ఈ నరమాత్రుఁడు మూడవ దినమున - నింపుగ
లేచెదననియెన్ = కాన సమాధిని భద్రము
సేయుడు - కార్యము నిజమని తెలియన్.

వ॥ అంత పిలాతు సమాధిపై నొక పెనుబండను వేయించి
వానిపైఁదనముద్ర వైచి కావలివారలనుంచెను, ఆదివారము
తెల్లవారుచుండగా

క॥ పరిమళతైలము వేగమె
మరియలు గైకొనుచువచ్చి • మాన్యుండగుశ్రీ
పరమాత్ముఁడేసు క్రీస్తుని
చరణంబుల పూజనలుప • సాగిరిపేర్మిన్,

తోహర.— రాతిసమీపంబున నొక దైవ - దూతనుగాంచి
సమాధిన్ = ఆదరమునగని ప్రభులేడని యీ
రీతిగ నేడ్చిరి పృథ్విన్.

రాగము॥ జంఝూటి • కీర్తన • తాళము॥ రూపకము.
ప్రభునెవండొగొంచుబోయెఁ-బ్రిభుని మోముఁ గానము
శుభదినంబని గ్రీస్తుఁబూజ-సేయవచ్చితి మక్కటా ॥ప్ర

వ॥ ఇట్లు దుఃఖించు నారీమణులతో దూత యిట్లనియె.

తోహర.— సందియమేటికి మన నాథుండీ - స్థలమున లేడు
సుమండీ-ముందుగ మీకం టెను గలిలయ్యకు-
మోదంబున జనెబోండీ

—.కీర్తన.—

(ఇంగ్లీషు రాగము)

1. మరణమున్ జయించెను - పరమసుతుండేసుడు
ధరసమాధిబంధముల్-కొరత లేక దుంచెను
నరసమాజమా! - పరుగులెత్తుమా
శిరము లెత్తుమా! - గౌరవింపుమా
పరమహాత్మ్యపురుషుండితం - డనునుచునమ్ముమా
2. నిజసువార్త యేసుడే- భజననొందనర్హుండే
సుజనమిత్రబంధుడే - వృజినములు హరించును
3. ధీరశ్రేష్ఠుండితండు - ఘోరవైరిం గూల్చెను
పారమార్థికంబగు ప్రాణస్నేహితుండహా.
4. మోక్షవాసమొసంగెడు - రక్షకుండు లేచెను
మోక్షరాజ్యమర్మపు - సాక్షి యేసుక్రీస్తహా.

వ॥ ఇట్లుపల్కినతోడనే వారలేగి క్రీస్తుశిష్యుల కెరింగింప పేతు
రత్యాతురమున ప్రభుసమాధిం జేరి యందు వస్త్రంబులు
దక్క మతేమియు లేకుంటగాంచి సంతసంబున పౌరుల
కెఱింగించిన పిదప

—• ప్రభుని ప్రత్యక్షతలు •—

రాగము॥ శంకరాభరణము. • కీర్తన • తాళము॥ రూపకము.

పరమరక్షకుండు ప్రథమంబున శ్రీ-మరియమగ్దలేనకుఁ
గన్పడె నెరుపతేమున గ్రీస్తునొందిన - మరణముఁ
ధ్యానించుచు సిమ్మాయి పురమునకు జనుచున్న క్లోపతు-
మరియొకనికి దర్శనమునిడెఁ బ్రభుఁడు ॥పర॥

1. కీడుమూడునంచునొక్క-మేడగదిని పదుగురు శిష్యుల్
గూడియుండ దర్శనమొసఁగి - సంతసింపజేసి - నాడె
మైనశుద్ధాత్మశక్తి-దోడుగానంపుదునని వచించెను ॥ప॥

2. సీమోనను పేతురుని బేర్మ ద - ర్శించె నేనునొక్కసారి
తోమా కగుపడి సందియంబును-దొలగించెను మృత్యుం
జయుఁడు-క్షేమమారసి యేసూరుగురికి - ప్రేమమూర్తి
దర్శనమొసంగెను ॥ పర ॥

వ॥ పిదప పదునొకండుమంది శిష్యులనో యేసుస్వామి గలిలయ
లోనిపర్వతమునకుగొనిపోయి వారి నాశీర్వదించి యిట్టుల
నాజ్ఞనొసంగె;—

రాగము॥ కళ్యాణి. • కీర్తన • తాళము॥ రూపకము

భూదిగంతములకు నాదు-వేదవాక్యము బోదుకొనఁగఁ
జాటుచే మిముఁ - బాయకనుండెదను గదిసి ॥భూ॥

1. నన్ను రక్షకునిగఁదలఁచి నమ్మజనులకు నన్ని వేళలందు
బాప్తిస్మ - మనుగ్రహింపుడర్మిలిని ॥భూ॥

వ॥ అంత జగద్రక్షకుండగు యేసుస్వామి వారిలోనుండి ప్రత్యే
కింపబడి పరలోకమున కారోహణుఁడాయెను.

తే॥ గీ॥ ఏరుమోక్షంబు వడయంగ • నిచ్ఛగింత్రో
వారు శ్రీయేసుదాసులై • వసుధ యోగ్యు
లనగనుత్తమోత్తములన • ఖ్యాతినొంది
నలలితంబు జీవింప • వలయుజుండి.

—• మంగళము •—

రాగము॥ భ్యాగ్. • కీర్తన • తాళము॥ ఆది.

మంగళమే దేవునికోమరునకు - మంగళమే స్తోత్రార్హునకు=మంగళమే శుద్ధాత్మదేవునకు - మంగళమే జగదీశునకు ॥మంగ॥



